శ్రీ

# హరిశతకము.

ఇది

శ్రీ రామభక్తాగ్రేసరుండగు

తూము నృసింహదాసుగారి పౌత్రుండును,

ప్రస్తుతము పెద్దాపురముతాలూకా

హెడ్ అక్కౌంటెంటుగా నున్నట్టియు

## తూము సీతారామయ్యచే

భగవద్భక్తిపరాయణుల కత్యంతోపయోగం

బగునటుల రచింపఁబడియె.



రాజమండ్రి

యస్. గున్నేశ్వరరావు బ్రదర్సువారి

శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1924.

---



శ్రీ

# హరిశతకము.



శా. శ్రీవత్సాంచిత కౌస్తుభాభరణ ల ◆ క్ష్మీశ్రీశోభితోరస్థలా
భావాతీత మహాప్రభావయుత సం ◆ భచ్ఛంఖచక్రోజ్వలా
జీవశ్రేణికృపామృతప్రవిమలా ◆ విహారిత నిర్వ్యాకులా
దేవవ్రాతసమాశ్రితాంఘ్రియుగళా ◆ సునిర్మలా! శ్రీహరీ.

ఉ. శ్రీరమణీయలోకచయ ◆ సృష్టివినాశనకారి! పాపసం
హార! చరాచరావనకృ ◆ పామృతనార! పరోపకార! హృ
ద్ఘోరవికారషడ్గుణవి ◆ దూర! వివర్జితపాపసజ్జనో
ద్ధార! జగద్విహార! విజి ◆ తప్రియదానుసార! శ్రీహరీ. 2

చ. పరిహృతపాపజాల! భవ ◆ బంధవిశత్వయశీల! ధర్మసం
సంకలితమానవప్రకర ◆ పాల! జగత్పరిపాల! మోక్షభా
సురవిభవాలవాల! పరి ◆ శుద్ధసుకీర్తివిశాల! భక్తహృ
త్సరసిజవాసలోల! నను ◆ సత్కృపఁజూడ వదేల! శ్రీహరీ. 3

మ. జగదాధార! జగత్సమూహరచనా ◆ సంరక్షశిక్షక్షమా!
జగదాకార! జగద్విహార! జగదీ ◆ శా! సజ్జగత్పావనా!
జగదాత్మా! జగదేకపూజిత! జగ ◆ జ్జాలప్రపూర్ణోదరా!
జగదస్వస్థహారా! జగన్నుత! జగ ◆ త్సాక్షీ! నను 4

మ. పరమానందవివేకసత్యమయరూ ♦ పా! నిర్వికారప్రభూ!
పరజీవప్రాపకృతీ! యనాదినిధనా! ♦ భవ్యాంతరంగా! చరా
చరసంరక్షక! కోటిసూర్యసమతే ♦ జా! జన్మమృత్యుక్షయా!
నిరపాయా! నిగమాంతవేద్య! కలుషా ♦ నీకోత్తరా! శ్రీహరీ. 5

ఉ. వరదా! చిన్మయ! నిర్మలా! నిరు ♦ పమా! వాత్సల్యపాథోనిధీ!
నిరయోత్తార! వికల్ప! సుగుణా ♦ నీకాశ్రియా! నిర్భయా!
పరమార్తప్రజదుఃఖనాశన! జగ ♦ ద్వ్రాతావనా! పావనా!
పరమాత్మా! తరమా నిను స్తగను ♦ తింప న్నాకు శౌరీ! హరీ. 6

ఉ. ఆరయ లేదు శాస్త్రవిష ♦ యంబులఁ బండితసేవఁ జేసి వి
ద్యారస మాన లేదు, భవ ♦ దద్భుతచర్యలఁ బ్రస్తుతింపఁగా
నేరుపు లేకయుండియును ♦ నీపదభక్తి న్స్మరించి యెట్టులో
నే రచియించుచున్న కృతి ♦ నిఁక గ్రహియింపఁగదే కృపన్ హరీ.

మ. భవబద్ధాత్ముఁడనై, విమూఢమతినై ♦ ప్రారబ్ధదుష్కల్మషా
ర్ణవనిర్మగ్నుఁడనైన నే నతిపవి ♦ త్రప్రస్ఫురచ్ఛాంతి హా
ర్దవివేకోజ్జ్వలు నిన్నుఁ బ్రస్తుతులచే ♦ సంతుష్టుఁ గావింపఁబూ
ను విరుద్ధం బగుసాహసంబు గుణాసిం ♦ ధూ! సైపవే శ్రీహరీ. 8

ఉ. ఎవ్వఁడు విశ్వజాలము ల ♦ యించినవెన్కను గూడ సత్ప్రభ
న్నివ్వటిలున్, దిక్కాలములు ♦ నేరవు జన్మలయంబు లెన్నఁగా
నెవ్వనిఁ గూర్చి, భూతచయ ♦ మెల్ల పునర్భవమొంద బీజమై
యెవ్వఁడు వెల్గునట్టి పర ♦ మేశుఁడ వీవకదయ్య శ్రీహరీ. 9

శా. నింగి న్వాయువు, వాయువం దనల ♦ మగ్ని న్నీరు, నీట న్ధరా
రంగం, బాధర సర్వజీవచయ, మీ ♦ ప్రాప్తిన్ జగజ్జాల ము
ప్పొంగన్ జేసితి వొక్కటిన్ మహాలోకటన్ ♦ బుట్టించి యీసృష్టిఁ బూ
డంగా నీమహిమ్నం బచింత్యమని రూ ♦ ఢంబౌఁ జుమీ శ్రీహరీ.

ఉ. ఒక్కయజాండ మొక్కయును ♦ దున్న తెఱంగెఱుంగ లేము నీ
విక్కమలాసనాండముల ♦ నీ యినులన్ బహుకోట్లసంఖ్యల
న్నిక్కముగా సృజించితట ♦ నీమహిమాద్భుతసృష్టిఁ దెల్పఁగా
వాక్కులు లేవు, నీకివె స ♦ ద్భక్తి సహస్రనమస్కృతుల్ హరీ.

చ. ఇను నొకనిన్ గనుల్దెరచి ♦ యేర్పడఁ జూడఁగలేని మర్త్యులా
యినమహితోజ్జ్వలాండముల ♦ నేకము లక్షలుగా వెలుంగు నీ
యనుపమసృష్టిరక్షణల ♦ యుక్రమదక్షసహస్రకోటి స
ద్దినకరతేజమున్ గనులఁ ♦ దేరి కనన్గుదురె శ్రీహరీ 18

శా. దావాగ్నిచ్ఛటనుండి వెల్వడెడు ♦ నుద్యద్విస్ఫులింగంబుల
ట్లావిర్భావము నొందు నీమొదల జీ ♦ వానీకముల్ తన్మాత్రలాం
భోవాతాగ్ని నభోగణంబులును త ♦ త్స్థూలంబుగా సర్వమున్
దేవా! పావకగర్భగోళము జగ ♦ న్నిక్షేపమో శ్రీహరీ. 19

మ. గిరులెమ్ముల్, ధరణీరుహంబులు శిరః ♦ కేశాళి, పద్మాకరో[యు
త్కరముల్ నాళ్ళు, నదుల్ నరంబులు, సము ♦ ద్రం బుజ్జ్వలత్కుక్షి,
ర్వరబాహ్వంఘ్రిముఖాఖిలాంగకము, శ్రీ ♦ భంగిన్ ధరామండలిన్
బరికింపన్ ఘనదుజ్జ్వలాకృతిగఁ జూ ♦ పట్టున్ జుమీ శ్రీహరీ. 20

మ. ధరణీజంబునఁ బత్రపుష్పఫలసం ♦ తానంబు కాలోచిత
స్ఫురణన్ బుట్టి నశించుఁ జెట్టు చెడదా ♦ చొప్పొప్ప నేతచ్చరా
చరయుక్తాఖిలసృష్టి పుట్టుచు వినా ♦ శంబొందు నుండున్ భవ
ద్వరదివ్యాంగమునందు నీవెపుడు ని ♦ త్యస్థాయివౌ శ్రీహరీ. 21

మ ఘనలోకావళియందు నెల్లెడల నా ♦ నాకాశంబు వర్తిల్లుచు
న్నను, గాఢన్యము లైనవస్తునిచయాం ♦ తస్సీమలం దుండదీ
వనఘా! యెట్టియచింత్యమూర్తివొకొ వ ♦ స్త్వంతర్గతిన్ గూడనుం
దు నృసింహోద్భవమా మహామహిమ ను ♦ ద్ఘోషింపదే శ్రీహరీ. 22

చ. జగముల సృష్టికై యజుని, ♦ శంకరుఁ దద్విలయంబొనర్పఁగా
నగణితజీవకోటుల మ ♦ హాద్భుతమోహతమంబునందుఁ గూ
ల్పఁగఁ బ్రకృతిన్ రచించి సక ♦ లంబున కీవాకరుండ వయ్యు సా
క్షిగతి నటింతు వెన్నుఁడ వి ♦ చిత్రిముల న్గనుగొంచు శ్రీహరీ. 29

మ. ధర వర్ధిల్లు సమస్తజీవులకు నా ♦ ధారైకనాథుండవై
పొగన్ రక్షణ శిక్షలన్ సలుపు నిన్ ♦ భావించి యేభక్తుఁ డే
వరరూపాఖ్యలఁ బ్రీతిఁగొల్చినను ♦ తద్భక్తస్తటాత్మీంతువా
వరరూపాఖ్యలవాని వ్యాత్కులసం ♦ వాసుండవై శ్రీహరీ. 30

మ. మనముం డూహదనించుమాత్రమున ♦ సంప్రాప్తించు నేకార్యమై
నను, నీ కెందును లేవసాధ్యము లజాం ♦ డశ్రేణిఁ దార్ఢ్యంబుగా
నొనరింపంగల శక్తిధీకుఁడ వ ♦ య్యున్ [illegible]త్కృపాంభోధి వో
టును గాదే సకలార్థముల్ కలుగుచుం ♦ ట[illegible] మా కిలన్ శ్రీహరీ.

ఉ. పెక్కులుకష్టముల్ ప్రజలు ♦ పెక్కనుండఁగఁగొంద్రు భూధవుల్
దక్క [illegible]కష్టమైనఁ దగు ♦ ధర్మముఁ బాలనసేతు మంచు, నీ
వెక్కుడు ప్రేమ లోకముల ♦ నేలెద వూరక సర్వమిచ్చి, వ
క్కెక్కడ దేవలోక మది ♦ యెక్కడ రెంటికి నెట శ్రీహరీ. 32

చ. సకలమహాస్థలంబులను ♦ సమ్మతిఁ జూచినయట్టి పుణ్యముల్
వికలముగాని చిత్తమున ♦ వేల్పులనందఱఁగొల్చు సత్కృతం
బకలుషితాంబువాహినుల ♦ నర్థిని స్నానమొనర్చు సత్ఫలం
బొకతృటిని స్థలంప వెల ♦ యున్నద పావననామ శ్రీహరీ. 33

మ. ప్రకృతి న్గూడి నిజాంశల న్బరపి జీ ♦ వవ్రాతసంజ్ఞన్ జగ
త్ప్రకరంబై విలసిల్లె దీవనుచు న ♦ ద్వైతంబును న్నీవు జీ
వి కతీతుండ వటంచు ద్వైతము ని ♦ టుల్ వేలీలల న్నీయు గా
ధకళావ్యాప్తివిఁబల్కెడున్ బహుమతాం ♦ తర్భేదముల్ శ్రీహరీ

శా. కించిజ్జ్ఞత్వముతోఁ, గుణత్రితయసం ♦ కీర్ణస్వభావంబుతోఁ
ద్రెంచనాని సతీసుతాలయధన ♦ ప్రేమానుబంధాళితోఁ
జాంచల్యస్థితి నుండు జీవి కెట్లుఁగా ♦ శక్యంబె నిన్నిర్గుణా
నందస్ఫూర్తి, నచింత్యశక్తిని, విరు ♦ ద్ధవ్యక్తినిన్ శ్రీహరీ. 47

శా. నిన్నున్ జ్ఞానులయుండియుం బుధవ ♦ రుల్ నీనామముం జిహ్వతో
డన్ నిష్టన్నుతియించి దుష్కలుషసం ♦ దఘ్వంసులై భూరిసౌ
ఖ్యోన్నత్యస్థితి బొందుచుందురట దే ♦ వా! నీశుభాకారముం
గన్నారన్ గనఁగూడినన్ గొఱఁత లు ♦ న్నా జీవికిన్ శ్రీహరీ. 48

మ. నిరహంకారము నిర్వికారమనము ♦ న్నిర్మోహముం సత్యవా
క్షరతత్వంబును సర్వభూతదయయుం ♦ మిత్రత్వముం శాంతముం
నిరతానందము నిర్భయత్వము, భవ ♦ న్నీరంధ్రసధ్యానముం
దిరమైయొప్పెడువానిఁ గూడెదవు కా ♦ దే భృత్యుఁ డట్టుల్ హరీ. 49

ఉ. భూతహితానురక్తి, సమ ♦ బుద్ధి జితేంద్రియవృత్తి కల్గి సం
ప్రీతి నినుం భజించెడు వి ♦ వేకియె నీ కనువైన భక్తుఁ డీ
వాతని నుగ్రకష్టనిచయం ♦ బుఁ గొల్పియు మోహదుర్లతా
వ్రాతముఁ ద్రెంపి వేగ భవ ♦ వార్ధిఁ దరింపఁగఁ జేతు శ్రీహరీ 50

మ. మతి నిందాస్తుతులుం హితాహితములుం ♦ మానావమానంబు లు
న్నతనీచస్థితులుం శుభాశుభములుం ♦ శత్రుత్వమిత్రత్వసం
గతులుం, గష్టసుఖంబులుం సమముగాఁ ♦ గైకొంచు నిన్గొల్చునా
న్నతయోగంబున కీవె యొట్టితప ♦ మైనన్గాం ధాత్రిన్ హరీ. 51

ఉ. భూతచయంబు నీవలె ♦ భూతచయంబులని న్విపర్యయా
తీతముగాఁ గనుంగొను సు ♦ ధీవిలసన్మణు లుచ్చనీచసం
జాతవిభేదముల్ విడచి ♦ సర్వశరీరులయందుఁ దుల్యస
ప్రీతిఁ జరింతు రట్టి సమ ♦ వీక్షితభావ మొసంగవే హరీ. 52

మ. తనయందుం గలతె సర్వభూతములపై ♦ దాక్షిణ్యభావంబునన్
మనునాతం డఖిలాగమానుగత ధ ♦ ర్మానుష్ఠసంశీలున
ట్లనపాయోజ్జ్వలమోక్ష మొందుఁ బరజీ ♦ వార్థానుకూలప్రవ
ర్తనకంటెన్ నిను బ్రీతుఁ జేయఁగలకా ♦ ర్యం బున్నదే శ్రీహరీ.

శా. కాంతిం బెట్టు లసూయలన్దరికి నా ♦ కర్షించు నాలీల న
శ్రాంతంబుం భవదంఘ్రిచింతనసుధా ♦ సారంబు సద్భక్తిసం
స్వాంతాబ్జాళిఁ గ్రహించునందునఁ గదా ♦ జ్ఞానుల్ భవద్భక్తిచేఁ
గాంతాపుత్రధనాళి నైన విడువం ♦ గా నోడరో శ్రీహరీ 54

చ. మలినపుగుజ్జయందుఁ గల ♦ మానికమట్టుల మోహలోభసం
కలితహృదంతరాళములఁ గల్గి ♦ యుఁ గానఁగరావు, జ్ఞానని
ష్ఠలహృదయాంబుజంబులను ♦ శోభిలుచుందువు నిల్వుట
ద్దమండలి ప్రతిబింబమట్లు కరు ♦ ణారసపూర్ణ మహాబ్ధి శ్రీహరీ 55

చ. అమలిన భక్తిసౌరభజ ♦ లార్ఘ్యము, హర్షరసాశ్రుపాద్యముం
గ్రమమున నిచ్చి చిత్తమృదు ♦ కంజసుఖాసనమందుఁ జేర్చి. హృ
త్సుమమునఁ బూజ సల్పి పరి ♦ తుష్టినిఁ గర్మఫలాళి నీకు స
ర్వముఁ దగ ధారవోయఁగల ♦ వాఁడు కదా యనఘుండు శ్రీహరీ.

చ. కనులకుఁ గానరాకయె య ♦ ఖండచరాచరజీవరాసులన్
ఘనతరకర్మపాశములఁ గట్టి ♦ యథేచ్ఛను ద్రిప్పఁగల్గియుం
దనువులఁ దాల్చి గూఢగతి ♦ ధాత్రి జరింతు వ కానేకష్టు స
జ్జనులకు దర్శనోత్సవ మొసం ♦ గుచుఁ గ్రీడ యొనర్ప శ్రీహరీ. 57

మ. ఘనసంకాశ భవజ్జగన్మయునిరా ♦ కారంబు నూహింపనే
ర నఖండోగ్రభవన్మహాజగదపా ♦ రవ్యాప్తదుర్లోక్యమా
తను వాత్మన్గన నేర, భక్తజనహృ ♦ త్పద్మార్కసరార్థసా
ధనమౌ దావకవైష్ణవాకృతి మం ♦ దాత్మన్నిల్పవే శ్రీహరీ. 58

మ. అతిచిత్రంబులొనర్తు భక్తజనర ♦ క్షార్థంబునన్ దైత్యని
ర్జితదేవాళి స్వర్గరాజ్యపదులన్ ♦ జేయన్ బలిన్వామనా
కృతినర్థించి త్రిపాదమాత్రము ధరి ♦ త్రిదానమున్ బొంది య
ద్భుతవిశ్వాకృతి నాక్రమించితి జగం ♦ బుల్ మూటినిన్ శ్రీహరీ.

మ. భవనాశాఖ్యుఁడవయ్యు ధర్మగతిలో ♦ పంచాతిజిన్ ధాత్రిసం
భవమైనా పెను భూధరంబు భృగుసద్వంశంబునన్ బుట్టి భూ
ధవదుర్గర్వమహాంధకారఘనమా ♦ ర్తాండుండవై జామద
గ్న్యవనన్ ఘోరకుఠారరాముఁడవనన్ ♦ బేరొందితుర్విన్ హరీ. 66.

మ. రవివంశంబునఁబుట్టి, శంకరుధను ♦ ర్భంగంబుఁగావించి, సీ
తవివాహంబయి తండ్రియాజ్ఞనువనాం ♦ తర్భూమికిన్ బోయి, దై
త్యవరుం డగ్రతపత్నిఁగొంచుఁజనఁ గీ ♦ శానీకమున్ గూడి య
ర్ణవమున్ గట్టి దశాస్యుఁగూల్చితివి ని ♦ ర్వంశంబుగా శ్రీహరీ 67.

మ. పురుషానీకములో రఘుప్రవరునిన్ ♦ బూఁబోండ్లలో జానకిన్
సరిపోలంగలవారలుండరె జగ ♦ త్సంసృష్టియుం దెందునన్
బరగన్ స్త్రీపురుషప్రవర్తనవిధి ♦ ప్రామాణ్యముల్ దెల్ప ని
ద్ధరణిన్ లక్ష్మియు నీవుపుట్టితిరి సీ ♦ తారాములై శ్రీహరీ. 68.

మ. వడఁకెన్నిర్జరభీతి సేతువుతజిన్ ♦ వారాశినీవ్రజ్యల
ద్బడబాగ్నిపరిదరాహతిన్ ప్రబలయుదు ♦ ర్వారాగమంబాక్ష్మాయం
చడలెన్ లోకము ద్రోణశైలమునుఁ జం ♦ డాంశోదయభ్రాంతిచేఁ
బడఁగూల్పన్ శరమీవుతాల్ప రఘురా ♦ డ్వర్యాకృతిన్ శ్రీహరీ.

మ. పరమద్రోహినిఁగాకుఁబ్రోచితివి శుం ♦ భద్భ్రాతృరిద్దైత్యాత్మజున్
శరణంబిచ్చి యనుగ్రహించితివి పా ♦ పాంబునన్ దివ్యమం
దరిఁగావించితి, కూర్మితోడనుడతన్ ♦ లాలించితాలించి తా

శా. ప్రాలన్దేల్చితి నీటఁ గ్రోతిగమిచే ♦ రక్షోబలంబుల్ విని
ర్మూలింపంగనొనర్చి తుగ్రమహితాం ♦ భోరాశికిన్ సేతువున్
లీలన్గట్టితి వద్భుతంబుగ మృతుల్ ♦ జీవింపగావించితో
త్రైలోక్యావన! రామతారకపరబ్ర ♦ హ్మంబ వీవే హరీ. 71.

ఉ. ఇచ్చితివ య్యయోధ్యఁగల ♦ యెల్లజనాళికి మోక్షవైభవా
త్యుచ్చపదంబుఁ గర్మజని ♦ తోగ్రనిబంధములన్ హరించి నీ
మెచ్చినకోర్కెకై నసజు ♦ మేలుపదం బొసఁగూర్తు మర్త్యులన్
హెచ్చుసుఖంబులిచ్చి కరు ♦ ణించుట నీకదియెంత శ్రీహరీ. 72

శా. శ్రీరామాకృతి నీవొనర్చిన పనుల్ ♦ చేతోగతిన్ జూచి దు
ర్వారాఘంబుల నైన నెంచక కృపా ♦ వారాశి వై నీదరిన్
జేరన్వచ్చెడు దీనకోటికి గతుల్ ♦ సేకూర్తు విం దంతటం
చారన్నమ్మి జనుల్ భజించెదరు రా ♦ మాఖ్యన్నినున్ శ్రీహరీ.

శా. రాముం డంచు, వికారకూరవిబుధ ♦ వ్రాతాంతరంగజ్వల
ద్ధాముం డంచు, దశాస్యముఖ్యఖల ♦ దైత్యధ్వాంతదీప్యత్ప్రభా
ధాముం డంచుఁ, ద్రిలోకపావనకరో ♦ ద్యన్నాముఁ డంచున్, బరం
ధాముం డంచు నిను న్నుతించెదరు స ♦ ద్భక్తుల్ సదా శ్రీహరీ.

మ. యదువంశంబునఁ బుట్టి, నందునిగృ ♦ హంబం దద్భుతక్రీడ లిం
పొదవన్ బాల్యమునందె సేసి కలుషో ♦ ద్యోగప్రశంసన్ విప
త్ప్రదుఁ గంసున్ బడఁగూల్చి భారతరణ ♦ వ్యాపారి వై దుష్టరా
డ్వధఁ గావించిన వాను దేవుఁడవు కా ♦ వా శ్రీనివాసా హరీ. 75

మ. బాలక్రీడ వధించి తెందఱనొ శుం ♦ భ ద్దైత్యసంఘంబులన్
జ్వాలాభీలదవాగ్ని మ్రింగితివి దు ♦ ర్వారాచలం బొక్క చే
లీల న్దాల్చితి, కాళియోరగఫణా ♦ ళి న్నిల్చి నర్తించి తీ

చ. నరునకుఁ గౌరవేశునకు • నందయశోదలకున్ గృపామతిన్
దరణి సహస్రకాంతి గగ • నంబునఁ గప్పుచు దుర్నిరీక్ష్యమై
యరయఁగ నాదియున్ గడయు • నట్టుల కందని నీ మహోద్భుత
స్ఫురదురువిశ్వరూపమును • జూపిన కృష్ణుఁడ వీవె శ్రీహరీ. 77

మ. అని సద్బాంధులఁ జంప సంశయవిషా • దాయత్తచిత్తంబు వే
తవిరుత్సాహముఁ బొందు నర్జునునిచెం • తన్నిల్చి సర్వార్థసా
ధనవేదాంతనిగూఢభావపరి • శుద్ధజ్ఞానదంబై తన
ర్చిన గీతామృతవృష్టి నిచ్చితివి • శ్రీకృష్ణుండవై శ్రీహరీ. 78

మ. బలరామాఖ్యఁ ద్వదంశ శేషుఁడు ధరా • భారంబుఁ బాపంగ భూ
తలి నీ కగ్రజుఁడై యమానుషబలో • త్సాహాతిరేకంబు శో
భిల జన్మించి కురుక్షితీశు పురి ను • ద్వేలక్రియన్ గంగలోఁ
గలుపన్ లేపిన చిహ్న నేటికిని సా • క్షాత్కారమౌ శ్రీహరీ.79

ఉ. శుద్ధతమాంతరంగమున • సుస్థిరసద్విధులన్ జరించినన్
బద్ధుఁడు ముక్తసంగుఁ • డయి భవ్యపదంబును బొందఁగల్గునం
చిద్ధరణీజనంబుల క • హీనకృపన్ బ్రచురించి మోక్షసం
సిద్ధులఁ జేసి తెందఱినో • చెచ్చెర బుద్ధశుభాకృతిన్ హరీ. 80

మ. ధరణిన్నిర్గతధర్మమై విధినిషే • ధశ్రేణి శాస్త్రార్తులై
పరితాపంబులు సజ్జనాళికి సుఖ • ప్రాప్తంబు దుర్జాతికిన్
బరగన్ ఘోరమహాఘభారము సహిం • పన్రానిదై యుండు న
త్తఱి జన్మించెదవంద్రు కల్కివయి స • ద్ధర్మంబు నిల్పన్ హరీ.81

మ. నరరూపంబున నొక్కయప్డు మృగజ • న్మంబొంది యొక్కప్పుడున్
బరులం దుర్బలమానిజాంశము స్ఫురిం • పన్ జేసి యొక్కప్పుడున్
స్థిరసంకల్పముమాత్రనొక్కొకపుడున్ • ఛిద్రింబులన్నాన్ని భూ
భరమున్ బాపెదు ధర్మసంస్కరణను • స్వాంతుండవై శ్రీహరీ. 82,

మ. రవియందంధతమిస్రముండ నట్టుఁజే ♦ రగాలేవు నిష్కర్మసం
భవబంధంబుల కామ్యకర్ముఁడవు గా ♦ న్నవ్రాతదూరుండవున్
భువనోగ్రాఘభరంబుఁ బాపుటకునై ♦ భూమిన్ భవంబొందుచుం
దువు నిన్నేర్కొనుమాత్రఁ బాయునుగదా ♦ దోషావళుల్ శ్రీహరీ.

చ. నిను ఘనభక్తిఁ గొల్చుచు న ♦ నిందితవృత్తిఁ జరించు నాయెడన్
గనికర మింతసూపకయ ♦ కాలము సద్గుణరాసులైన మ
త్తనయులఁ గొంటి విస్మృతను ♦ దగ్దయి దుర్భరగర్భశోకవ
హ్నిని సనుఁగూల్చి, యేమనఁగ ♦ నేర్తు భవద్విధిఁ గూర్చి శ్రీహరీ.

శా. మున్నెన్నింటినొ కష్టరాసులను ని ♦ ర్మూలించి నీపాదభ
క్తున్నన్గారవమిచ్చి యిప్పుడు విప ♦ ద్ఘోరానలజ్వాలలో
నన్నిష్టేతుక కేలఁద్రోసి తకటా ♦ నాయందుఁ దప్పేమి యే:
మున్న న్నిచ్చకపైని వ్రేయుదురె బ్ర ♦ హ్మోగ్రాస్త్రమున్ శ్రీహరీ.

శా. నాపై నీదయ తప్పెనో, యఘముల ♦ న్గావించినానంచు నీ
కోపస్వాంతముఁ జూపనెంచితో, నినున్ ♦ గొల్వంగనేమానినా
నో, పాపవ్రతమత్పురాకృతఫలం ♦ బో యెట్టులైనన్ సరే
నీపాదాశ్రయుఁ డన్నదా యిటులఁ జ ♦ న్నే నెయ్యఁగా శ్రీహరీ. 86.

చ. చెలువగు పుణ్యకోటి తమునఁ ♦ జేరు సుఖంబులటంచుఁ గష్టముల్
కలుగుటకున్ బురాకృతము ♦ కారణమంచుఁ దలంచి మంచిచె
ష్టలయెడ నొక్క నీతిని ద ♦ డంబడకే నినుఁ గొల్చుచుంటి నీ
విలసదపాంగదృష్టి ప్రభ ♦ వింప మికేమికతంబు శ్రీహరీ. 87.

మ. నిను ధ్యానించుకొలంది నేలయొకొ న ♦ న్వేధించు ఘోరాపదల్
ఘనకష్టంబులఁ బెట్టె నామదిఁ బరి ♦ తున్ జేసెదో యన్న నా
మనమందున్ వసియించు నీ వెఱుఁగవే ♦ మచ్ఛక్తి యుక్తిస్థితుల్
చనునే నిర్దయఁ బడ్డవానిఁ బదిరా ♦ ళ్ళన్ గొట్టఁగా శ్రీహరీ. 88.

మ. ధరణిన్ జేసిన కర్మబంధచయముల్ ♦ దప్పంగ రావంచుఁ జె
ప్పిరి మున్పండితులట్టులైన నిను ను ♦ ద్వేలాఘ గాఢాంధకా
రరవిజ్వాల యటంచుఁ బల్కెడు శ్రుతి ♦ పాలించుమా యేమహా,భవ
చ్చరణధ్యానముచే మహాఘములు భ ♦ స్మంబౌఁగదా శ్రీహరీ. 89

శా. నెమ్మిన్ జూడక కన్నతల్లి శిశువున్ ♦ శిక్షించినన్ గానఁగా
రమ్మం చెవ్వరిఁ జీరఁగల్గునది, నే ♦ రన్నీయదే తల్లి యో
యమ్మా! యమ్మ! యటంచు బిడ్డ తను డా ♦ యన్ బోవ? నాలీలనీ
వెమ్మాడిక్కని సంస్మరించినన్ శరణ మీ ♦ వే నాకుఁ జుమ్మీ శ్రీహరీ.

మ. మృతులన్ జీవములిచ్చి తెచ్చితివి ♦ కూర్మిన్ సాధ్వమానంబుఁగా
చితి చేలంబులొసంగి యక్షయముగాఁ ♦ జేతన్ మహాద్రిన్ ధరిం
చితి; కంబంబునఁ బుట్టితింకను మహా ♦ చిత్రంబులెన్నో యొన
ర్చితి మున్దీనులఁగావ నిప్పుడేటఁ జే ♦ రెన్ బ్రేమ నీకో హరీ. 91.

మ. కరిదైత్యేంద్రసుతాంబరీషముఖ భ ♦ క్తవ్రాతసంరక్షణాం
బరయంగా బహుపూర్వగాథలు కదా ♦ యార్తప్రజాపోషణా
చరణస్వామి వటే యిప్పుడట్లయిన నీసద్భక్తమర్త్యాళి కె
వ్వరయాదిక్కు? భవద్యశంబెటు ధరన్ ♦ వ్యాపించెనో శ్రీహరీ.

ఉ. మున్ను మహోజ్వలస్థితినిఁ ♦ బొందిన భక్తులు నీకు బంధులే
సన్నుతసత్ప్రవర్తనను ♦ జాలినవారలు వారలన్న, గ్రి
గ్నమ్ముల నీవు సూడక య ♦ ఘంబులఁ బాసిరె వారలైన నన్
జన్మ నిసూపు చూచుటకు ♦ నే నొనరించినదేమి శ్రీహరీ. 93

మ. బలికిన్ బంటుతనం బొనర్పఁ జనితో ♦ భక్తావళుల్ నీ మహో
జ్వలపాదద్వయి హృత్సరోజములలో ♦ బంధించిరో, పోవఁగా
వల దీవెందని లక్ష్మి తావకలస ♦ ద్వక్షస్థలి న్నిల్చెనో
యిల. గానంబడ వెందు దీనులకు ది ♦ క్కెవ్వా రికన్ శ్రీహరీ. 94

ఉ. దాసుల మానసంబుల ము ♦ దంబున గోచరమయ్యె వంద్రుఁడు నీ
వేసమయంబునం దయిన ♦ హృద్గతి నాకుఁ గనంగరావు నీ
దాసుఁడఁ గానొ నాదు దురి ♦ తంబుననో, కృప లేదొ నీకు, నీ
దాసుల పాదభక్తుని వి ♦ ఘంబున నైనఁ దలంపవే హరీ. 95

ఉ. అమ్మయు నయ్య నీవె యని ♦ యాత్మను నమ్మి నటించు దీన లో
కస్థుల బాధపెట్టుట య ♦ ఖండకృపానిధి వైననీకు న్యా
యమ్మె? కృతాదికాలముల ♦ నైనను గాదన నోర్తుగే కలిన్
రమ్మి, భవంబుఁ జిమ్ము, సు ♦ కరంబుగ నీకృప నిమ్ము శ్రీహరీ. 96

మ. సదయాత్ముండవు గావొకో యనఁ గృపా ♦ సారాబ్ధివార్తాభయ
పరివదకుండవు కావొకో యన జగ ♦ ద్రక్షుండ వర్ధార్జనా
సదుపాయంబులు లేవొకో యన రమా ♦ స్థానంబురం, బస్వతం
త్రదశన్ జిక్కితొ యన్న నీవ ప్రభువే ♦ తత్సర్వసంసృష్టి కీ
విధి నన్నిట్టు సుమేటివయ్యుఁ గరుణన్ ♦ వీక్షింపవేలా హరీ. 97

చ. నిను శ్రితమూలనేటికి ము ♦ నివరిజ మేపదపద్మముల్ మనం
బున స్మృతిఁ జేర్చి నిత్యసుఖ ♦ ము స్థనఁగల్గెడి నేత్రి లోకపా
వనపదపద్మ రేణువుల ♦ స్పర్శ యహల్య శిలాత్వ మార్చె నా
యనఘపదాంబుజంబులు మ ♦ దార్తి హరింపఁగ లేవె శ్రీహరీ. 98

శా. నీనామంబునఁ జేర్చియుండు నెపుడున్ ♦ దివ్యత్సుధామాధురీ
పానీయం బది గోరిల సంసృతి విప ♦ ద్వారం బడంగున్ గదా,
యానామం బెట దాఁపఁగాఁగలవు నా ♦ యావత్ప్రమేయస్థితుల్
దానన్ జేకుఱ నిన్న చింత్య నిటులే ♦ లాసన్నుతింపన్ హరీ. 99

చ. ఎఱుఁగక యంటినన్ గదుద ♦ హించుఁగదా యనలంబు తత్క్రియన్
గరము మనంబు లేక యయి ♦ నన్ భవదుజ్వలదివ్యనామసం
స్మరణ మొనర్చినన్ గలుష ♦ మండలి పాయుఁ ద్వదాఖ్యలోనియ
క్షరములయందె పావత్పుణ ♦ సంరతుయవహ్ని వెలుంగు శ్రీహరీ. 100

ఉ. కార్మిక బోధలన్ సయిపఁగా ♦ ధృతిసాలక తంద్రితోవైన నీ
నిర్మలధార్మికత్వముఁ గ ♦ ణించి నినున్ బహునిష్ఠురోక్తులన్
మర్మము లంటనాడిన ప్ర ♦ మాదము సైపఁగదయ్య చిత్తమున్
గూర్మినిఁ జూడుమయ్య నిను ♦ గొల్చెడు దాసుఁడనయ్య శ్రీహరీ.

శా. మోక్షస్థాన మసంగఁ దావకపదాం ♦ భోజాతియుగ్మంబె, త
న్నిక్షేపానుభవైకసాధన మనన్ ♦ నీభక్తియే త్వత్కటా
క్షాక్షీణపరిధ కల్గకున్న నగునే ♦ యాసాధనప్రాప్తి, శ్రీ
వత్సా! నామది నాటవే తిరముగా ♦ త్వత్పాదభక్తిన్ హరీ. 102

చ. దేనిఁ బరీక్ష సేసినను ♦ దేనిని విన్నను దేనిఁ గాంచినన్
దేని మది న్దలంచినను ♦ దేనిఁ జేసిన సేవ మూలము న్
ద్దాని కటంచుఁ దోచు మదిఁ ♦ ద్రచ్చి విమర్శనొసర్ప, నాత్మ
జ్ఞానము నిల్పవే సతము ♦ శల్యగతంబుగ యుండ శ్రీహరీ. 103

ఉ. ఇంచుకయు న్వివేక ముడి ♦ యింపగ పుత్రసతీధనాలయో
దంచితసంసృతిన్ దిరమ ♦ టంచుఁ దలంచి దురంతపాప మా
ర్జించితి నింతదాకఁ దెలి ♦ సె న్నిజ మిప్పుడు, నారకాంబుధిన్
ముంచక కావవే యఘవి ♦ మోచనదక్షకటాక్ష శ్రీహరీ. 104

మ. తనువందున్ బులకల్ జనింప, నయనద్వం ♦ ద్వంబులన్ హర్షబా
ష్పనికాయంబులు గ్రమ్మ, గద్గదిక ♦ సంప్రాప్తింప, నిశ్చంచలా
త్మ ననంతు న్బరమాత్ము నిన్ను త్రుటిమా ♦ త్రంబైనఁ జింతింపనో
ప్పనదే పుణ్యాదినంబు తక్కినదినంబుల్ ♦ వ్యర్థముల్ శ్రీహరీ. 105

మ. తనయద్వంద్వ మకాలమృత్యుఘనదా ♦ వాగ్నిజ్వాలల న్మగ్గఁ ద
ద్ఘనదుఃఖాంబుధిఁ జాక తావకపద ♦ ద్వంద్వైకచింతన్ విమో
హనివృత్తిం గని సద్గతిన్ బడయఁగా ♦ హర్షించుచున్నాఁడ నో
యనఘా! నే శరణార్థిఁ జూపఁగదె నీ ♦ యంఘ్రిద్వయిన్ శ్రీహరీ.

మ. నిను గాదంచెట కేగఁ గూడు నెవరిన్ ♦ జేరందగున్ విశ్వము
ల్లను నీవేయయి జీవకోటియెడఁగూడ ♦ స్స్వీయమై యుండఁగా
వ్రున నన్నాచినఁ గావకున్న విడువన్ ♦ బో నీపదధ్యానముం
ఘనకారుణ్యపయోధివై యెటుల న ♦ న్రక్షింపకుందే హరీ 107

మ. వెలయున్నేలసియెంచి యత్నములు గా ♦ వింపంగ నాయత్నముల్
బలుకీడు ల్గలిగించు నొక్కపరి దే ♦ వా! యింత లే కాదె మా
తెలువుల్ చేటలు, భావికార్యములబు ♦ ద్ధిన్ జూడఁగాలేము మా
తెలుపుల్ నీకృప లేనికాలమున వ్య ♦ ర్థంబు ల్గదా శ్రీహరీ. 108

ఉ. ముట్టినదెల్ల స్వర్ణమయి ♦ పొల్పువరంబును గాంచి యన్నముల్
బట్టి తినంగఁబో నదియు ♦ బంగరమై తినరా మిక్కుదవ్యన్
గిట్టి నొకింతయుం డటుఁ ♦ గ దొనరించెను దుర్గతాశలన్
బుట్టఁగ నీవు మయ్య తెగు ♦ భోగమె యింగదవయ్య శ్రీహరీ.

ఉ. పంచని చేతి నిప్పుఁగొను ♦ బొలుచు, కాలిన నేడ్చు నట్లె రా
నుండు విపత్తుల న్దెలియ ♦ కొప్పనికార్యము లేమి సేయుచున్
జండతరాపదల్ కలిగి ♦ నన్ గడుఁగుందెడ నయ్య నీభుజా
దండసహాయ మిచ్చి సుప ♦ థంబునఁ ద్రిప్పఁగదే నను న్ హరీ.

మ. అయయో! నే నొనరించునట్టి ప్రతికా ♦ ర్యంబాదు దోసంబు తె
ల్వియె కన్పట్టు సకల్మషంపుఁబడిఁ గా ♦ వింపంగ లే నొక్కటిన్
భయమా నాయఘముల్ దలంచిన నెటుల్ ♦ పాలించెదో నన్ను నీ
దయ నాభాగ్యము లేదు వేఱుగతి శు ♦ ద్ధపాపిభవా! శ్రీహరీ. 111

ఉ. ఏది విపత్ప్రదంబొ మఱి ♦ యేది శుభప్రదమో కనుంగొనం
గాఁ దగుజ్ఞాన మించుకయుఁ ♦ గల్గదు నాయెడఁ గ్రుడ్డివాఁడు ముం
దేదియుఁ గాన కేగుగతి నేఁ ♦ దనుయాత్రను సల్పుచుండు నీ
పాదము లే సహాయ మెటుఁ ♦ బాపెదొ కష్టచయంబు శ్రీహరీ. 112

శా. చూడంగా జూడంగ సంసృతిం గలవటం ♦ చుందోచు సౌఖ్యస్థితుల్
పీడ ల్గాంగనవచ్చుంగాని సుఖమే ♦ వేళ్గననారిదు నీ
జాడ ల్దెల్పు జగద్విలాసముల ని ♦ చ్ఛన్గాంచుచుం గాంతులం
పీడన్గల్గి నిసుం భజించిమనుమం ♦ టేం సౌఖ్యమున్నే హరీ. 113.

మ. నిమిసంబైన మనంగఁజాలుదుమె శ్రో ♦ ణిన్నీదుహస్తావలం
బము లేకున్నఁ బరిమానసంకలితముల్ ♦ మాజీవనంబుల్ మహా
ల్పము మాపరిజ్ఞ, భవద్వంశంబున సదా ♦ వర్తింతుమే కాని నే
రము మాయంతమనంగ నెట్లుగడతేర్పం జూచితో శ్రీహరీ. 114

మ. దయచే నీవు సృజించియుంచిన పదా ♦ ర్థవారితముల దెచ్చి యెం
తయుఁ గట్టం గొంచుగం దినంగగు ♦ ప్రయత్నంబునుచేంకాని నే
నయయో నీపదభక్తి నష్టముగఁ ♦ జేయుంగాలకున్నాడ దు
ర్నయతాపత్రియముల్ హరించి కరుణం ♦ గాపాడవే శ్రీహరీ.

చ. తెలియక నేయుపాపముల తీఱువచింపఁదరంబుగాదు నే
తెలిసియొనర్చినట్టివె యతిపరిబలంబులుగాన సంఖ్యలై
తలపున భీకరాహంవిధంబున నాల్కలుసాపుచుండు నో
కలుషవిహంత నీశరణుకన్న మఱేగతిలేదు శ్రీహరీ. 116.

మ. జలదవ్రాతము మింటనల్దెసల నా ♦ చ్ఛాదించిమార్తాండు ను
జ్వలకాంతిం బరిసరింపనీక ధరణిం ♦ బల్చీకటిన్నించున
ట్టుల నీమాయవిమోహపాశములఁజు ♦ ట్టుం మానసంబుం విని
ర్మలవిజ్ఞానముఁదోఁప నీదుపరికృతిం మల్పంగదే శ్రీహరీ. 117.

చ. నిరతము నీదుసద్భజన ♦ నిశ్చలచిత్తముతోడఁజేసి దు
స్తరభవనీరధిన్గడచి సద్గతినొందఁగవచ్చునన్న, భీ
కరవిషమావరోధకము ♦ కాదె యవారితకుక్షిబాధ త
ద్భరముహరించునే బహువిధంబులఁ ద్రిమ్మఱకుండ శ్రీహరీ. 118

మ. తనుజీవేంద్రియమానసంబులు యథా ♦ ర్థంబెన్న వేర్వేరులై
సను క్షీరాంబువులట్లు లైక్యమగుచున్ గాయంబె తానంచు నె
మ్మనమున్; మానసతంత్రమందుసుగులున్ మాయావిమోహస్థితిన్
మనుఁ దన్మోహతమంబుఁబాపఁగదె వి ♦ జ్ఞానప్రభన్ శ్రీహరీ. 119

ఉ. ఎన్నఁడుసూపెదో కరుణ ♦ యెన్నఁడు మానసశుద్ధిఁ జేసెదో
యెన్నఁడు చింతలార్పెదవొ ♦ యెన్నఁడు నిర్మలసౌఖ్యమిచ్చెదో
సన్నిహితంబుగొందె మృతి ♦ జాగొనరించుటచన్నె విత్తసం
పన్నుఁడ వచ్చుదాశ ధర ♦ వర్ధిలు నేనిరుపేద శ్రీహరీ. 120

ఉ. దాసునితప్పులన్నియును ♦ దండముతోఁ సరియన్నయట్లు నే
జేసిన పాపరాసుల న ♦ శేషము మన్ననసేయుమంచు నీ
భాసురసత్పదాబ్జములు ♦ భావమునన్గని మ్రొక్కుచుంటి దే
వా! సదసద్వివేకసంగా ♦ సత్తనఁ జూపఁగ నేర్తునే హరీ. 121

ఉ. నేరములెన్నుచో నిలువ ♦ నేరఁజుమీ క్షణమైననీదరిన్
బారములేదు నాకలుష వార్ధికి నీకరుణామృతాబ్ధికిన్
ఘోరతరాఘవారములఁ ♦ గూల్పఁ సమర్థులు నీవుతక్క ను
న్నారె యుపేక్షయోర్వఁగలనా పరమార్తజనావనా హరీ. 122.

ఉ. ఆకలిదప్పులన్ సయిచి ♦ యాత్మఁ దిరంబుగనిల్ప నేర, మైఁ
దాఁకెడు శీతలోష్ణపరి ♦ తాపములోఁ లోపఁగనేరఁ జిత్తమున్
సోఁకెడు నప్రియోరములకు ♦ నుక్కక నిల్వఁగనేర, యిట్టి
న్నేకరణిన్ కృపాజలధి ♦ యేలెదొ పాపమడంచి శ్రీహరీ. 123.

మ. తనువే తానని దేహసౌఖ్యమునె పా ♦ ర్థాన్యంబుగాఁ జూచుచున్
మనమందున్ క్షణమాత్రమైన నినుసం ♦ భావింపఁగాలేని దు
ష్టనరుం డెంతయుసంపదల్వడయు నీ సద్భక్తుఁ డాపన్నుఁడౌ
ననఘత్వంబునకా కాపదాగను మన ♦ శ్యపాప్తమా శ్రీహరీ.

మ. వరుసన్ నూరును ముప్పదేడు విలస◆త్పద్యప్రసూనంబులం
తరసద్భక్తిగుణానుగుణ్యములుగా◆ దామంబుఁ గావించి హృ
త్సరసీజంబును నాయకాంచితలతాం◆తంబట్లు బంధించి నీ
యెఱుతన్ దాల్పఁగ నిచ్చినాఁడఁ గొనుమం◆య్యా సత్కృపన్ శ్రీహరీ.

శ్రీ హ రి స మ ర్ప ణ మ స్తు.

శ్రీచింతామణిముద్రాక్షరశాల:—రాజమండ్రి.

# వేదాంత గ్రంథములు.

| | | |
|---|---|---|
| స్త్రీసహవాసం | 0 | 10 |
| సంగీత సైంధవార్జునీయం | | |
| Xll శ్రీ | 0 | 3 |
| సంగీతపాశుపతార్జునీయం" | 0 | 8 |
| సీతాకళ్యాణం | 0 | 3 |
| గాంధీవిజయధ్వజం (శ్రీ క్క) | 1 | 0 |
| తిలకమహారాజునాటకం ,, | 1 | 0 |
| చారుమతీనందివర్ధనీయం | 1 | 10 |
| వాసవదత్త పరిణయము | 0 | 8 |
| చారుమతీపరిణయము | 0 | 12 |
| ఆంధ్రనాటకకృతులు మొదటిభాగం | 0 | 10 |
| బ్రహ్మజ్ఞానానందము | 2 | 0 |
| ఇంద్రప్రపంచసృష్టిక్రమం | 2 | 0 |
| అఖండజ్ఞానము | 2 | 0 |
| ప్రపంచలయము | 2 | 0 |
| తత్వజ్ఞానవృత్తి | 2 | 0 |
| భగవంతునిప్రభావము | 2 | 0 |
| జనులగ..ములు | 2 | 0 |
| స్త్రీలుచేయుచర్యలు | 2 | 0 |
| ముక్తిమార్గము | 2 | 0 |
| గృహస్థధర్మమార్గము | 2 | 0 |
| యింకను అనేక విషయములుగలవు చదివితీరవలయును | | |
| తిలక్ భగవద్గీత | 3 | 8 |
| భగవద్గీత పద్యములు | 1 | 0 |
| భగవద్గీత వచనము | 0 | 6 |
| భగవద్గీత (మూలం) | 0 | 6 |
| అద్వైతసుధానిధి, ఆంధ్ర టీకాసహితము 1-3 భాగములు సాంఖ్యతారకములుగలవు | 1 | 12 |

| | | |
|---|---|---|
| అద్వైతసుధానిధి 2 వ భాగము ఇందు శివస్వరోదయము షట్చక్రనిరూపణమును గలవు. | 1 | 0 |
| అద్వైతసుధానిధి 4 వ భాగం అమనస్కమార్గముగలదు | 1 | 0 |
| అద్వైతసుధానిధి 5 వ భాగము ఇందుఅవధూతగీత స. టీక. | 0 | 10 |
| పరిపూర్ణబోధ సిద్ధాంత శిరోమణి అను శివరామ దీక్షితీయము | 1 | 0 |
| సుజ్ఞానదీపము | 0 | 12 |
| శ్రీరామ వాశిష్ఠసారము | 0 | 8 |
| శ్రీసీతారామ ఆంజనేయ సంవాదము టీకా తాత్పర్యం క్యాలికో | 3 | 4 |
| డిటో తాత్పర్యం (అచ్చులో) | | |
| సనాత్స్వేశ్వర సంవాదము క్యాలికో | 1 | 0 |
| శంకర గీతాభాష్యం | 1 | 0 |
| రామానుజ గీతాభాష్యం | 1 | 0 |
| శంకరవిజయము సవ్యాఖ్యానము | 2 | 0 |
| వేదభాష్యం మొదటి అష్టకం | 8 | 0 |
| అరుణభాష్యం | 2 | 0 |
| వేదాంత పరిభాష | 1 | 4 |
| శివగీతసాంద్రతాత్పర్యం | 0 | 6 |
| బ్రహ్మగీత తాత్పర్యం | 1 | 6 |
| ఉత్తరగీతసటీక | 0 | 10 |
| రామగీతసటీక | 0 | 8 |
| హరిమీడేస్తోత్రము సటీక | 0 | 4 |

# ఆంధ్రనాటకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| చిత్రనళీయము ధ. కృ | 1 | 6 | సారంగధర | 0 | 8 |
| విషాదసారంగధర | 1 | 6 | సంగీతజయంతీజయపాలం | 0 | 8 |
| పాంచాలీస్వయంవరము | 1 | 2 | ఉషాపరిణయము | 0 | 8 |
| మోహినీరుక్మాంగద | 1 | 2 | హస్తినాపురము | 0 | 8 |
| ప్రమీలార్జునీయము | 1 | 2 | ద్రౌపదీ పరిణయము | 0 | 12 |
| చంద్రహాస | 1 | 2 | విజయబొబ్బిలి | 0 | 12 |
| బృహన్నల | 1 | 2 | శ్రీకృష్ణతులాభారము | 0 | 12 |
| ముక్తావళి | 1 | 2 | సంగీత కనకతార | 0 | 10 |
| వరూధిని | 1 | 2 | వైదర్భీవిలాసము | 0 | 10 |
| చిరకారి | 1 | 2 | సామ్రాజ్యోదయం | 0 | 10 |
| గయోపాఖ్యానము చి॥ల | 0 | 8 | ఆంధ్రపతాకము | 0 | 12 |
| ప్రసన్నయాదవము | 0 | 8 | పాదుకాపట్టాభిషేకం-పాటలు | 0 | 12 |
| పారిజాతాపహరణము | 0 | 8 | లంకాదహనము పాటలు | 0 | 10 |
| చతురచంద్రహాస | 0 | 6 | చతురచంద్రహాస | 0 | 8 |
| స్వప్నవాసవదత్త | 0 | 8 | గులేబకావళి ఆ॥ నృ॥ | 1 | 0 |
| పార్వతీపరిణయం | 0 | 6 | ఊర్వశీశాపవిమోచనము | 1 | 0 |
| సంగీత సత్యవిజయమును హరిశ్చంద్ర ధ॥ మా॥ | 1 | 0 | జయచంద్రచంద్రరేఖావిజయమును లాల్ గోపాల | 0 | 10 |
| సంగీతసావిత్రి ధ॥ మా॥ | 1 | 0 | ప్రతిజ్ఞాపాండవము | 0 | 10 |
| సంగీత ప్రహ్లాద | 0 | 12 | శ్రీకృష్ణవిలాసము | 0 | 10 |
| మహారాష్ట్రవిజయం | 0 | 12 | విచిత్ర బిల్హణీయం వు॥ అ॥ | 0 | 8 |
| చంద్రకాంత పాటలు | 0 | 10 | మణిమాల | 0 | 12 |
| సంగీత శశిరేఖ | 0 | 8 | రసపుత్రవిజయం ఇ॥ రా॥ | 1 | 0 |
| రంగారాయ కథనమువా కారము బొబ్బిలియుద్ధము కా॥ పా॥ | 1 | 0 | చింతామణి కా॥ నా॥ | 1 | 2 |
| | | | పద్మవ్యూహము | 1 | 0 |
| | | | శ్రీరామవిజయం కో॥ వా॥ | 0 | 10 |
| కన్యకాపరమేశ్వరి | 1 | 0 | శాకుంతల కం॥ వీ॥ | 0 | 12 |
| సుగుణమణి న॥ బా॥ | 0 | 10 | సత్యహరిశ్చంద్ర | 0 | 8 |
| శ్రీరామజననము ద్రో॥ శీ॥ | 0 | 8 | ప్రబోధచంద్రోదయం | 0 | 8 |
| శ్రీరామప్రవాసము | 0 | 8 | రత్నావళి | 0 | 8 |
| శ్రీరామవుద్యోగము | 0 | 8 | దక్షిణగోగ్రహణం | 0 | 6 |
| శ్రీరామవిజయము | 0 | 8 | మాళవికాగ్నిమిత్రం | 0 | 6 |
| శ్రీరామాశ్వమేధము | 0 | 8 | చమత్కార రత్నావళి | 0 | 4 |
| పాండవఅజ్ఞాతవాసం | 0 | 8 | సుశీల వి॥ నా॥ | 0 | 12 |

☞ కావలసినవారు కె. కృష్ణమూర్తి మేనేజరు, శ్రీచింతామణిముద్రాక్షరశాల, రాజమండ్రి అని వ్రాయవలయును.